# భారతి

సాహిత్య మాసపత్రిక



సంపాదకుడు

శివలెంక శంభుప్రసాద్




ఆగస్టు 1956

సంపుటము 33 : : సంచిక 8

విడిపత్రిక వెల ఒక రూపాయి

# ప్రతి మైలుమీద డబ్బు నిల్వచేయండి





పట్టణంలోగాని కుగ్రామపు రోడ్ల మీదగాని ఎట్టి విధములైన బరువులతో నైనను సెన్-రాలే బైసికిల్సు ఎక్కువ కాలంమన్ని రిపేరీల ఖర్చు లేకుండా అవి పరిగెత్తే ప్రతి మైలుమీద విలువగల అణాలను భద్రపరచును.











## రాలే
## రాబిన్ హుడ్












SRX-38 TG

# విషయానుక్రమణిక

## ఆగస్టు 1956



(X) ఈ విషయము వింటు తెల్ప

# వే కు వ రా ణి

కీ. శే. శ్రీ అజ్జాడాదిభట్ల నారాయణదాసు

*

ఉషోదేవత నభివర్ణించు ఋగ్వేద
మంత్రములకు తెలుగు పేత

*

తెలివిమీఱఁగ మాకుఁ దెల్లవాఱించు
పగటివెలుఁగు దొత్తిఁబరపి యెల్లపుడు
పాడిపంటల కల్మి బ్రబలించు మీవు
వింటికూరిమి బిడ్డ! వేకువరాణి!

గుఱ్ఱము లావులు కోరిన సిరులు
కమ్మతావుల హాయిగా వీచుగాలి
రాచలీవిన్మాకు రప్పించు మెపుడు
వేడుకొందుము నిన్ను వేకువరాణి!

వెలయించితివి తొల్లి వేడుకమీఱ
నెన్నియో లేఁబ్రొద్దు లిప్పుఁటి వలెను,
అరదము లోడలు హాయి నడ్పితివి
విన్ను మన్నలరించు వేకువరాణి!

పేదసాదలనెల్లఁ బెంచిన తల్లి
ముజ్జగంబుల మెప్పు పొందినయమ్మ
మేనితాల్పులనెల్ల మేల్కొల్పు వేల్పు
వేంచేయు బంగారు వేకువరాణి!

పూఁటపూఁటకుఁ బాయముం బొడిగించి
వాసిగాఁ బిట్టలం బై కెగిరించి
మేలైన యిల్లాలు మెలఁగు చందమున
వేంచేయు బంగారు వెకువరాణి!

# నాగహృదయం

రమణశ్రీ

'ఈరేయి కలలో దేవత తెలిపిందట. గుడి గట్టిస్తున్నారు భాగ్యవంతులు.'

ఇటికలతట్ట నెత్తికెత్తుకుంటూ అంది నాగి...

కొత్తగా పనిలోకొచ్చిన దుర్గప్ప నాగికళ్లలో నాట్యమాడే అందాలు చిందరవందరగా చూస్తూ, 'ఏ దేవత? ఎలా తెలిపింది?' అన్నాడు.

'పొలం గోని, దున్నుతున్నారంట! యేదో యిగ్గరహం నాగేటికర్రు కడ్డంబడి దుగ్గి పొగనిచ్చింది గాదంట! అర్రేత్రి భామందుకల్లో గనబడి గుడి గట్టించమందంట! సేకపోతే వొంపం నాసనమైపోయి, దరిద్రం సుట్టుకొంటాదని, పలుకు సెప్పిందంట...ఆ యిగరహం కొళ్లుసుట్టూ పాములూ, ఆడమనిషి బొమ్మా ఉంది... దాన్ని నాగదేవత, నాగేటిదేవత అని కొలుపులు దీరుస్తున్నారు'...

నాగికళ్లలో చిన్న ఆవేశం తొణుకులాడింది! భక్తితో ఆపాదమస్తకం జలదరించింది!

దుర్గప్ప నమ్మలేకుండా నవ్వుతూ, 'ఆ భామందు కంపాలు పోగుసేశాడా! ఏదో యిగ్గరహం దొరికితే దాన్ని బట్టుకొని, గుడి గట్టించడమేటి?....డబ్బున్న వాళ్లేసే యెత్తు....'

'సందా ఐదారేలు పోగడివాడి...పూనుకొని పని సేయిత్తన్నాడు దర్మప్పెబువు...'

గుడి కడుతోన్న మేస్త్రీల కేకలవి ఉలిక్కి పడ్డారు. కిందకు దింపుకొన్న తట్ట మళ్ళీ నెత్తికెత్తుకొని పరుగెత్తింది.

'యెదవ పెపంచకం! అంతా మోసం!' అంటూ పళ్లు బిగబట్టాడు దుర్గప్ప.

మళ్ళీ నాగి సున్నంకోసం వచ్చింది.

'ఎవర్నైనా మనువు సేసుకొన్నావా?'

'ఇంకా లేదు! తగినోడు తగిలి రావొద్దూ?' అంది దుర్గప్ప కండలు తిరిగిన భుజాలమీద చూపులు నిగిడిస్తూ.

దశ వరిపాటి ఇనుపరేకుని కొలిమిలో కాల్చి వంపులుదీర్చినట్టున్న వయస్సునిండా ఊపిరి పీల్చుకొని 'నీకెవరైనా ఉన్నారా? గుడిసెక్కడున్నాదీ?' అన్నాడు దుర్గప్ప.

'ఎవరూ లేరు. నేనూ ముసిలవ్వా. అంతా కలరావగిలి పోనారు.'

సున్నం దీసుకొని, పోతోంది.

పోయిన దిక్కునే చూస్తూ, దుర్గప్ప ఏదో మధురబాధ గుండెలో నెమరుకు తెచ్చుకొంటున్నాడు.

నాగిలాంటి పిల్లనే మనువు చేసుకొన్నాడు. తొలెనెంత ఓలిపోసి, బాహువుల్లో చిక్కించుకొని, వయస్సు సార్థకం చేసుకోబోయాడు. నెల్లాళ్ళు కాపరం చెయ్యకుండానే, గూడెంలో ఎవడితోనో లేచిపోయింది. అప్పట్నుంచీ వెతుకులాడుతూ ఇక్కడ పనిలోకొచ్చాడు. నాగిని చూసినప్పట్నుంచీ, వెనకటి దానిమాట మర్చిపోవాలనిపిస్తోంది.

నాగి నిచ్చెనెక్కి ఇటికలందిస్తోంది. మేస్త్రీల పరాచికాలకీ సరాగాలకీ సమాధానం చెప్తోంది. దుర్గప్ప దూరంనించి, చూపందుకొన్నాడు. అక్కణ్ణుంచి కాల్జారిపడితే, అమ్మో....ఒక్క ఉదుటన ఎగిరివెళ్ళి చేతులు కాచి, చేతుల్లో ఇరికించుకొని, గుండెలకి హత్తుకొంటు చాలీచాలనివి!...ఊహల్లో మెరుపులు కురుస్తూ, మళ్ళీ ప్రత్యక్షమైంది!

తట్ట నేలకేసికొడుతూ కూలబడింది.

'దొంగనాకొడుకుల్లు! నోటికొచ్చినట్టు కూస్తున్నారు. వాళ్ళ నోట పురుగులడ...'

మేస్త్రీలని తిట్టి పోసులు పెడుతోంది!

'ఏటి సంగతి?' అన్నాడు దుర్గప్ప మెల్లగా.

'అల్లా....మేస్త్రీలు ... కారుకూతలు కూస్తన్నారు.' అంటూ కళ్ళంట నీళ్లు తిప్పుకొంటోంది....

'నువ్వుండిందు. నే సెల్తా...' అన్నాడు దుర్గప్ప.

దుర్గప్పకేసి జాలిగా చూసింది కళ్ళలో కదుల్తోన్న కాంతి చెక్కిళ్ళమీదనుంచి జాలువారుతోంది.

దుర్గప్ప గుండెకి ఆ చూపులు ఉప్పెన కలిగించినయ్! అక్కణ్ణుంచి నాగి తట్ట నెత్తి కెత్తుతోంటె దుర్గప్పే అందించి వచ్చాడు.

మధ్యాహ్నం వేళ ఇద్దరూ అన్నాలు ఒకచోట కూర్చుని తిన్నారు. 'ఈ జెవన్లో సేవ తెలిసింనంట.' నాగి మునివాక్కులు జ్ఞాపకంలో గిలగిల్లాడుతుంటున్నయ్! నాగి తన హృదయదేవాలయంలో దేవతై వెలిసినట్టుంది! అంత అందంగా స్వాభావికంగా నవ్వుతూ త్రేలుతూ తన గుండెలో దేవాలయం కడుతోన్న నాగి.

తట్ట నెత్తికెత్తుతున్నప్పుడు కళ్లలో ఏదో వెదికేది. దిష్టి తగిలేలా వంపులు తిరిగిన శరీరంవైపు చూసేది. ఏదో పారేసుకొన్న దానిలా వెదుకులాడేది. వ్యక్తావ్యక్తంగా నవ్వేది. చిరునవ్వు పెదవుల చివర త్రుంచి పారేసి, ఏదో వేళాకోళమాడేది.

'ఇయ్యాల కూడెవరొండారు?' అంది నాగి.

'నేనే'

పక్కున నవ్వింది.

'గొంతు దిగజారే, జావనాగ సంకటి నేసుకొన్నా వేఁ?' అని మేలమాడింది.

దుర్గప్పకి, ఆ నవ్వూ, వేళాకోళం ఏవో అజ్ఞాత సౌందర్యలోకాల పూర్వాపరాల్ని ఉపదేశించి, బాంధవ్యానికి అఱ్ఱులు చాచాయి. అన్నం తిన్న ముంతలూ గిన్నెలూ రెండూ తనే కడిగి తెచ్చిపెట్టింది. ఆడుతూ పాడుతూ, పని దకదకలాడుతూ పూర్తి చేసేసరికి చీకటి పడిపోతోంది.

మేస్త్రీలు రెండు రూపాయల నోటిచ్చి, మార్చుకోమన్నారు. నాగి దుర్గప్ప మొహంకేసి చూసింది.

దుర్గప్ప వెనకాలే నాగి బయల్దేరింది ఊళ్ళోకి! మెలికలు తిరుగుతూ పోతున్న పాములా కాలుదారి ఊళ్లోకి ప్రవేశిస్తోంది. దారికి పదిబారల దూరంలో ఉన్న పుట్టవైపుకి వేలెట్టి చూపిస్తూ అంది నాగి:

'సూశావా ? ఆ పుట్టలో బారెడు తాసుపాము న్నాది. అదే మా పాములుమావని కాటేసి పొట్టబెట్టుకొంది! అదినించి, ఆ పుట్టంటే బయం నాకు!'—

పుట్టలో ఏదో కదిలినట్టనిపించింది.

బారెడు నాగు...

నాగి నున్నని భుజాలమీంచి కేరుతూ జారుతున్న జడవైపు చూశాడు. బారెడు నాగు.

'ఐతే పాము నెవరూ సంప నేదూ?' అన్నాడు.

'అమ్మో! దేవుణ్ణి సంపడమే!...నాగరాజు... సొంతం నాశిమైపోదూ ?... ఇల్లంతా పాములు పాములైపోయి, విషం కక్కి కక్కి, పగ తీర్చుకొంటాయి.

ఆ రోజు రేతిరికే, పాములుమావకీ నాకూ పెళ్ళి గావాల...ఊరినించి కావాల్సిన సరుకులూ గుడ్డముక్కలూ కొనుక్కొంకి వస్తన్నాడన్నమాట! సన్నగా సీకటడిపోయింది—పుట్టదరికి కొచ్చేసరికి బయం బుట్టింనంట! గుసగుసల్నాగ బుసబుస లినిపించినాయంట! పడిగెత్తి పారాడుతూ, కోరాడుతా వస్తంటే కళ్లు బయిర్లుగమ్మినయ్యంట...తిరవాత సుమాడిప్పి పడిపోవాడు...ఆ దారి నొస్తన్నావోళ్లు ఊళ్లోకి మోసుకొచ్చినారు. ఆకిరికి ఎటికయ్య మంత్రింగూడా పని సేసిందిగాదు. ఎన్ని మంత్రతంత్రాలు సేసినా, నాగరాజు కాటుకి బలయిపోవాడు.'

నాగి గొంతులో తడియూరి వణికిపోయింది. కళ్ళలో కమ్ముతోన్న చీకట్లు కాటుకతో కరిగి చెక్కిళ్లమీద చారలు కడుతోన్నట్టు అస్పష్టంగా చూశాడు దుర్గప్ప.

'మనువు సేసుకోడానికెవరూ రానేదా?' అరాతి

'నన్ను సేసుకొన్నావోళ్ళని పాము కరుత్తాదని ఊళ్ళోవాళ్లు సెప్పుకుంటుండేవారు. అణ్ణించి ఎవరూ రా నేదు'—

దుర్గప్ప కళ్ళలో ఆశ్చర్యం మెరిసింది.

'మాయమ్మ రోజూ దణ్ణం బెట్టుకొనేసెంట, ఈ దారిని పోతా యీ పుట్టకి—అప్పుడికింకా పిల్లలుం బుట్టక, దిగులు పడుండేదంట!...పుట్టకు దణ్ణాలెట్టి

న్నాటేసించి, ఏదో కొత్తాపిరొచ్చినట్టుందేంటి!... నన్ను గన్నాది తరాత.'

'నాగరాజు వరానబుట్టా నన్నమాట....అందుకే నీపేరు నాగి' అన్నాడు దుర్గప్ప అప్రయత్నంగా...

'అందుకే నాగి పేరెట్టారు!... నేను కన్ను దెరిసిన నెల్లాళ్ళకి మా యమ్మ కన్నుమూసిందంట!...... అప్పటించి మా మామ్మే సాకొచ్చింది...తల్లిని పొట్ట నెట్టుకొన్నానని తిడతావుంట దిప్పటిగ్గూడా?

'మీ అయ్యెవరో నీకు తెలుసా?' అన్నాడు దుర్గప్ప.

'ఎవరో తెలవదు.' అంటూ సిగ్గుతో తల వంచింది.

'ఓహో! అనుకొన్నట్టూరుకొన్నాడు దుర్గప్ప.

'మీ మామ్మయినా నాగరాజుకి కొలుపులు దీరిసిందా?'

'అమ్మో! కొలుపులే! అంత డబ్బేడనిందో సది!'

'అందుకే నిన్ను చేసుకోబోయేవాణ్ణి కాటేస్తుంది?

నాగి దుర్గప్ప కళ్ళలోకి సూటిగా చూసింది. 'నిజమేనా?' అన్నట్టు.

కిరాణా కొట్టుదగ్గర చిల్లర మార్చుకొన్నారు.

నాగి కావలసిన సామాను కొనుక్కొని వెళ్ళిపోయింది.

దుర్గప్ప నెమ్మదిగా పాడుపడిన గుడిలోకి చేరుకొన్నాడు.

* * * *

చెట్టుకింది పక్షి దుర్గప్ప. నా అనేవాళ్ళు, బంధాలూ బంధువులూ లేని ఒంటరి పక్షి. ఎక్కడికి వెళ్ళినా రెక్కలు గొట్టుకొని బతకాలిసిందే! ఊరూరూ తిరుగుతూ ఈ వాడిక్కడికొచ్చిపడ్డాడు. దేవతలాంటి నాగి హృదయాన్ని తియ్యని ఊపిరితో పూరిస్తోంది. ఎక్కడో చిక్కని ఆనందానుభూతిని అందిస్తోంది. నాగి వాడిచూపులు ప్రతి క్షణం వెంటాడుతునే వున్నయ్!...

నాగిని తన లోలోపల ఐక్యం చేసుకోనేందుకు ప్రయత్నిస్తూ, నిద్రాదేవి కౌగిలిలో ఒరిగిపోయాడు.

చెట్లు చల్లగా వీవనలు విసురుతున్నయ్. చంద్రుడు వెన్నెల ధారపోస్తున్నాడు. చుక్కలచీరల మేఘకాంతలు చంద్రుడితో దోబూచులాడుకొంటున్నయ్. మిణుగురులు గుంపులు గుంపులుగా కిందికి దిగివచ్చిన నక్షత్రంపిల్లల్లా ఆడుకొంటూ, సంగీతం పాడుకొంటున్నాయి.

దూరంలో పద్మాకారంలో వెలుస్తోన్న గుడి, వెన్నెల పాలకి తడిసి నానిపోతోంది...దారిలో పెద్ద పుట్ట...బంగారపు పుట్ట...నాగరాజు పడగెత్తి నాగస్వరానికి ముగ్ధమోహనంగా నర్తిస్తుంటే, ఆ పడగపైన నాగి......నాగకన్యలా అపురూపసౌందర్యతరంగాలు పొంగిపారుతోన్న సాగరంలాంటి నాగి...

పాము పడగల బుసబుసల మధ్య నాగి...

ఆ నాగిని చేతుల్తో పట్టుకొందామని ప్రయత్నిస్తోన్న తను...అందకుండా ఏ లోకాలో కాలకో తేలిపోతోన్న నాగకన్య...సర్పాల పహారాలో సాగిపోతోన్న నాగి...

అడుగులు ముందుకు పడుతున్నయ్!...

పుట్టదగ్గర పడుతోంది...

పడగల బుసబుసలు బిసబిసల సరంభం...

నాగినెవరో అందుకుపోతున్నారు...

చేతులు చాచి కావలించుకోబోయాడు......

పాదాలు గడగడ వణకసాగినయ్!......త్రాళ్ళతో కట్టివేసినట్టు...కాళ్ళ నిండా నెత్తురు...కొన్ని వేల కాట్లు. విషజిహ్వకీలలు... నాగి ఎగిరెగిరి గుడిమీద తేలింది.

పద్మందళాలమీద మహోద్వేగంతో నర్తిస్తోంది...పరుగెత్తాడు. కాళ్ళలో సత్తువ తేలిపోతోంది..

నాగి కాలుజారి అతని చేతిలో మెత్తని మాంసం ముద్దలా, నెత్తుటిగడ్డలా పడింది.

గుండెలను హత్తుకొని...

కెవ్వున కేక వేశాడు...

కేకలకి చెట్లమీద పక్షులు రెక్కలారుస్తూ ఎగిరిపోయాయి. కాళ్ళవైపు చూసుకొన్నాడు. ఒక వెచ్చని నిట్టూర్పు ముఖాన్ని మేఘంలా అలుముకొంది!

కలను కన్నాడు.

భయం గుండెల్ని పిండిపారేస్తోంది!

నాగి కేకిలా కనిపించింది.

నాగిని చేసుకోవటమంటే మాటలా?

అంతశక్తి నీకుందా? అన్న ప్రశ్న వేస్తోందికల..

ఏవో పూర్వాకరాలు స్మృతిపథంలో రేగాయి.

తెలతెల్లగా తెల్లవారింది.

పనిలోకి బయల్దేరాడు. అప్పటి కప్పుడే నాగి పనిలోకి వచ్చి సిద్ధంగావుంది. నాగిని చూసేసరికి ఏదో కొద్దిపాటి భక్తి, ఆవేశం కలిగించుకోబోయాడు—

నవ్వుతూ పిలుస్తూ నాగి పలకరించింది, నిన్నటి తనువు మరింత వృద్ధి చేసుకొంటూ.

'నీతో పలకరిస్తే అపకారమేమో? నాగరా జూరుకొంటాడూ?'

దుర్గప్ప వేళాకోళం చేశాడు.

'ఇంకా నయం! పాముల్ని గానీ వేసుకో పోతివా?' అంటూ మూతి ముద్దుగా ముడుచుకొంది!

'ఊరికే నే అన్నాన్లే నాగీ! యేరే బ్రెమెట్టు కోకు'

దుర్గప్ప ఊరడింపుకి కరిగి ప్రవహించింది నాగి. ఈ మనువుకూడా ఆ తాచుపాము మూలంగా చెడి పోతుందేమో అనే భయం లీలగా గుండెచుట్టూ తిరగ పాకింది.

నిన్నటిలా చనువు ప్రదర్శించడంలేదు దుర్గప్ప.

విషవాసన తగిలినట్టు దూరదూరంగా తప్పుకు పోతున్నాడు. కలలకీ జీవితానికీ సంబంధమేమిటి? అంత పిరికితన మెందుకు తనలో? రకరకాలుగా వ్యతిరేకంగా ఊహించుకొంటూ ఎడమొగం పెడ మొగం పెట్టి పనిచేస్తున్నాడు.

మేస్త్రీలు ఎగతాళిచేస్తూ, 'ఒకరోజుకే విడిచి గొట్టేసింకేటి యెవ్వారం?' అన్నారు దుర్గప్పని!

కాస్తంత ధైర్యం చిక్కించుకొని, 'మూతి ముడుచుకొన్నావేం? నాగీ! నా మీద కోపమా?'- దుర్గప్ప నాగిలో అసహనం పారదోలడానికి ప్రయత్నిస్తూ అన్నాడు.

మొహంమీద ఎరుపు చిరునవ్వు తెచ్చిపెట్టు కుంటూ అంది. 'నాకేం కోపం! నీ మనసెవరో యిరి చేసినట్టు, మింగినా కూటాడకపోతే, ఎలాగుంటది చెప్పా?'

దుర్గప్ప భావతరంగాల్లో ఒడ్డు చేరుకొనే ప్రయత్నంలో వున్నాడు. మధ్యాహ్నం అన్నాలు తినేటప్పుడు తను తెచ్చుకొన్న పచ్చడేదో పెట్టబో యింది. ఆ పచ్చడి చిత్రంగా కనిపించింది. విషవాసన తగిలినట్టు తగిలింది వద్దని వారించాడు. మళ్ళీ కథ మొదటికొచ్చింది.

'చింతకాయ పచ్చడికేం?' అంది మొహం ముడుచుకొని...

'అదేదో తెలకాయ పిసగ్గొట్టిన పచ్చడిలా వుంది గాని, చింతకాయపచ్చడిలా లేదు...అయ్యేటి పచ్చగా మెరుస్తున్నాయ్?' పచ్చడివైపు చూపిస్తూ అన్నాడు.

పకపక నవ్వింది, 'మిరపగాయ ముక్కలు మెరవడ మేంటి?' అంది అమాయకంగా...

దుర్గప్ప కళ్లకి ఎక్కడచూసినా పాముల మెలి కలే! పాము కుబుసాలే! బయటికి పొడుచుకొస్తోన్న నాలికలే! ఏ రంగుచూసినా విషంలాగే! ఈ విప రీతానికి భ్రమసిపోయాడు. గుండెదిటవు కోహ్రద్రిమా కల తనని భ్రమపెట్టేందుకు ప్రయత్నిస్తున్నాయ్. ఇంతటి వైపరీత్యానికి కారణం నాగికళ్లు! ఆకళ్లలో ప్రతిఫలిస్తోన్న జ్వాలాతరంగం...నవ్వుతూ ప్రేలుస్తూ తనచుట్టు వలయాలు తిరుగుతోన్న జ్వాలాతరంగం...

ఐనా భావోన్మాదంతో ప్రవర్తించకుండా అటు పోటుకి నిలబడి పనిచేశాడు. నాగిని చూసేసరికి పూర్తి ఏవగింపు కలిగింది.

చిరుచీకటి పడింది!

పని కట్టిపెట్టి బయల్దేరారు.

పుట్టవైపుదారి మానేసి, అడ్డత్రోవ బయల్దేరాడు. నాగికూడా నిశ్శబ్దంగా బయల్దేరింది అతని వెంట. ఉన్నట్టుండి ఆకాశాన మేఘం క్రమ్ముకొంది. చీకటి మరింత చిక్కబడింది!

దారిలో 'దుర్గయ్యమావా!' అంది నాగి. గొంతు పూడిపోయింది.

కళ్లలో ఏదో వెలుతురు దారి చూపుతోంది!...

నేత్రాంచాల్లో కాంతి ప్రేలాడుతోంది భయంగా.

అనునయంగా దుర్గణ్ణి చుట్టబెట్టుకోబోయింది.

పాము తన శరీరాన్ని చుట్టబెట్టుకొన్నట్టు అను భూతి పొందాడు. చల్లనిగాలి విసిరింది. విద్యుత్

ఊర్పులు మెంగాన్ని పెదవుల్ని వరవరాల్ని ఉద్రేకిస్తున్నయ్!...రక్తం తరంగములుంగా ప్రవహిస్తోంది ఆపాదమస్తకం...

'నాగీ!'

ఉద్రేకం శేక వేసింది!

జలజల మేఘం వర్షించింది!

నాగి ఉలిక్కి పడింది.

దగ్గర్లో పాడుపడిన గుడి...

గుడిదగ్గరికి చేరుకో నేసరికి గాలివాన...

ఆగాలిలో వానలో ఏకో రహస్య ప్రణ(శ)య భయంకర సందేశం!

దట్టంగా కమ్ముకొన్న మేఘాలు వర్షిస్తున్న ధారలో తడిసిపోయారిద్దరూ...వర్షలోకం లోంచి ఊడిపడ్డ మానవాతీతశక్తుల్లా ఉన్నారు!

'నే నిక్కడే నిద్రపోతాం'—దీపం వెలిగించి, అన్నాడు దుర్గప్ప చలికి వణికిపోతూ.

వంటిమీంచి వర్షబిందువులు ముత్యాల్లా తూలి పడుతున్నయ్! నాగి ముఖంమీద ఉంగరాలు తిరిగిన ముంగురులు రింగురింగున ఊగుతూ ముత్యాలు రాలుస్తున్నయ్!...

'పురుగూ పుట్రా ఉండే చోట, ఇక్కడేనా నీ నిద్ర?' అంది.

దుర్గప్ప కళ్లలో తళుకు చూశాడు. కంఠంమట్టూ తడిసి నానిపోతోన్న అందం, భుజాలకిందుగా బాహువుల్లోకి జారుతోంది!... మైకం కమ్మింది. ఏం చూస్తున్నదీ చేస్తున్నదీ అతని చైతన్యంలో లేదు.

'అపరాధం...పొద్దుణించీ, నీ కళ్లలో మెరుస్తోన్న పాము మెలిక లేమిటి?'

లోలోపల ఘోష!

వినిపించలేదు అతని చెవులకి! గుడ్డిదీపం ఇద్దర్నీ చూసి రహస్యం దిగమింగుతోంది!

గాలికి రెపరెపలాడిపోయి అస్తమించింది వెల్తురు. నాగి పాములా మెలికలు తిరిగిపోయింది అవనిమట్టూ పెనుగులాడుతూ. మెరుపు మెరిసింది. మేఘం అరిచింది...ఎక్కడో ప్రణయదేవాలయం వాకిళ్లు తెరుస్తున్న చప్పుళ్లు...

గంటలో విపరీత పరిణామంతో శాంతించింది ప్రకృతి. మెల్లిగా బయటకొచ్చారు...

'దుర్గయ్య మావా'.

హోరున సముద్రం పొంగినట్టు ఏడ్చింది అతని గుండెల్లో తలదాచుకొని...

'ఛా... ఎందుకూ ఏడుపు? నువ్వే నా మనువు. నిన్నే మనువు సేసుకొంటా!' దుర్గప్ప మాటల్లో విశ్వాసం ఏడుపుని అరికట్టింది.

మెల్లిగా చీకట్లో దారి తడుముకొంటూ, తడుము కొంటూ పారిపోయింది నాగి!...

గుడ్డిదీపం వెలిగింది దుర్గప్ప కళ్లలో.

స్తంభందగ్గర ఏదో చరచర పాకినట్టయింది! త్రుళ్లిపడి చూశాడు. ఏం కనిపించలేదు. చిత్తభ్రమ.

అక్కణ్ణుంచి జాలి జంపాన పెట్టసాగింది మనసు. అంత గుండెదిటవూ నీరుకారిపోయింది. ప్రాణాల్ని ఉగ్గబట్టుకొని ఊపిరి విడిచాడు. ఎండుగడ్డి మంటబెట్టాడు. చలికి వంకరదీరిన నరాలు సాగాయి. రక్తం రవరవ పాకింది. మెదడులో శిలాద్రవం కరిగింది.

మంటలో జ్వాలల నాలికలమీద నాగి నృత్యం చేస్తోన్నట్టు కనిపించింది. పాములు మెలికలు తిరుగుతు న్నట్టున్నయ్ కీలలు! మంట ప్రక్కనే వెలుగుతూన్నా హృదయంలో వణుకు పోలేదు. భయం పీల్చిపారేసిన పిప్పిలా ఉన్నాడు మనిషి.

నాగితో ఎంత అపచారం చేశాడు? 'దాని ఫలితమే అనుభవిస్తున్నావ్! గుడ్డిదీపం మిణుకు మిణుకుమంటూ సాక్ష్యమిస్తోంది! పాడుపడిన గోడలు ఛాయాచిత్రాలు తీసుకొని, తిరిగి ప్రదర్శిస్తున్నట్లని పించింది! ప్రకృతిలో ఇంత విపరీత పరిణామాలు నమ్మలేకపోయాడు!...

ఏనాడూ కంటనీరు పెట్టనివాడు భయంతో ఏడ్చాడు.

'వెంటనే పారిపో'

లోలోపలి ఘోష!

నాగితో మనువో?

'నీ ప్రాణంకంటె ఎక్కువా? పాము పగబట్టి కాటేస్తే?'

..............

పాముకాటుకు నురగలు గక్కుతూ, పొగలు

తేలుతూ చొంగలు కారుస్తోన్న మరణముఖం కనిపించింది!

* * *

'దుర్గయ్య మావా!'

పాడుబడి ప్రతిధ్వనించింది — 'శిథిలాల యమ్ముల్లో శివుడు లేడోయి' అని — నాగి గొంతు సుడి తిరిగిపోయింది.

అతడు లేడని, ఆక్రోశించి చెప్తోంది వాతావరణం.

'పనిలోకి గాని రాలేదేమో!'

గుడిసెగ్గరికి పరుగెత్తింది. 'ఇయ్యాల పనిలేదే నాగీ! దుర్గప్ప గాని గనబడితే సెప్పు'

మేస్త్రీ అన్నాడు సున్నంగుట్ట బాగుచేస్తూ.

'ఎవరితోనూ చెప్పడం? మింటికెగిసెల్లోనా? పాడుపడినగుడిలో విగ్రహంతోనా? ఎవరితోనూ చెప్పడం?...

దుఃఖం గుండెలో దిగదొక్కుకుంటూ పుట్ట దారిపట్టి పరిగెత్తింది! ఒక్క ఊపున గుడిసెలోకి కుక్కి నులకమంచంమీద ఎగిరిపడింది.

కారెడు నాగ్రాతములాంటి జడ పడగవిప్పి బుస గొడుతున్నట్టుంది. విషజిహ్వాజ్వాలల్లో పెదవులూ, ముఖం, కళ్లు తేలిపోతున్నట్టున్నాయ్!

'ఏమే నాగీ! అంతిపరీతంగా వున్నావ్?' అని ముసలక్వ సమాధానంకోసం ఎదురుచూసింది!

దుర్గప్ప మనువుసంగతి తడబడుతూ చెప్పేసింది.

'ఇకేం! దగా చేశాడన్నమాట! నీ బతుకు పెనంలో కాల్చుకుతిన్నాడు'

ముసలక్వ మెటికలు విరిచింది.

నాటినించీ, అలా బతుకుతూవచ్చింది నాగి. దిగులుగా, నీరసంగా మసిలింది. ఆదిగుల్లో నీరసంలోనే, నెల అని తేలింది. అంతులేని ఆవేదన... దుర్గప్ప తన కడుపులో చిచ్చుపెట్టి, ఎక్కడికో పారిపోయాడు!...

'ఎక్కడికీ పారిపోలేదు...దుర్గయ్యమావ నాకడుపులో సిక్కడిపోయాడు' అనేది ముసలమ్మతో పిచ్చిగా. పిచ్చిపిచ్చివేషాలేసేది. వాగేది. పాడేది.

'అదుగో! దుర్గయ్యమావ పుట్టలోంచి వస్తున్నాడు. పుట్టమీది కెక్కుతున్నాడు...పడగెప్పిన నాగరాజు, పగబట్టిన నాగరాజు మావేనని కాదే కాదు'—

తొమ్మిదినెలలూ కంటికి రెప్పలా కాపాడుకొచ్చింది ముసలక్వ. పదోనెల పైబడుతోంటే, నాగి కడుపు పండి, శిశువును కంది. అప్పుడే కుబుసంవిడిచిన పాములాంటిబిడ్డ...చేతిలో పాములా మెలికలు తిరిగిపోతున్న బిడ్డ...తల్లిపాలు తాగడానికి బుసలు గొడుతున్నబిడ్డ...

పాములా పక్కమీదపాకిపోయేవాడు. పాము చారలు...పడగలా తల!...ముసలక్వ బిడ్డణ్ణి చూసి మురిసిపోయింది! 'పాములూ' అని పేరుపెట్టింది! పాము చెవులే! ఎక్కడ శబ్దంవిన్నా ఉలిక్కిపడేవాడు. కొడుకుని పొత్తిళ్లలో పొదువుకుని పెంచుకొంటోంది నాగి...దిగులు మరిచిపోయింది. వంట్లో బాలింతరాలి చాయ మెరుగులుదీరింది. 'చక్కనమ్మ చిక్కినా అందమే' అన్నట్టుంది!

ఊరంతా ఈ 'పాములిన్ని' చూడ్డానికొచ్చారు. జాతిమత విచక్షణలేకుండా.

పూర్తిగా పాము కడుపున పుట్టినట్టున్నాడన్నారు. బుసకొట్టడం విని, గజుక్కుమన్నారు... పాము నాలికలాంటి నాలిక చూచి విస్తుపోయారు... పడగలాంటి తలచూసి ఝడుసుకొన్నారు! నాగిపేరు పత్రికాప్రపంచంలోకి కూడా ఎక్కిపోయింది. దానితో దిక్కులు మారుమ్రోగాయ్...మనిషికి పాము పోలికల్తో, బుసల్తో బిడ్డపుట్టాడని....

నాటినుంచి, ఆపల్లెటూరు తీర్థమైపోయింది. క్రిక్కిరిసిపోయింది. దారిలో పుట్ట ఆవుపాలతో తడిసి నానిపోయింది. పసుపు కుంకుమల్తో ఎఱ్ఱగా పసుపుల కొండలా దూరానికి కనిపించింది!

'పాములు' బుసవిని, నాలికలు చూచి ప్రపంచం నాగలోకంవైపు భ్రమించిపోయింది!

దూరాన పద్మాకారంలో వెలిసినగుడిలో దేవత, పుట్టవైపు ఈర్ష్యగా చూసింది! పుట్ట నానాటికి పెద్దదైపోతోంది నాగలోకమంతా భూతలంమీద వెలుస్తుందా అన్నట్టు!...ఈ వేడుకలూ, తీర్థప్రజా, ప్రచారం అంతా నెల్లాళ్ళలో పొంగులా అణిగిపోయింది.

ఈ పొంగులోనైనా దుర్గప్ప ఎక్కడైనా తేలి కనిపిస్తాడేమో అని చూసింది. కళ్లు ప్రతిఫలించలేక

పోయాయి. తీరని ఆశమాత్రం మిగిలింది!...ఆ ఆశతో ఎప్పటికైనా కొడుకుకోసమైనా రాకపోతాడా? అని బతుకుతోంది నాగి!

కాలం గిరగిర తిరిగి యేడాది దాటింది.

'పాములు' పాకిపోతున్నాడు ఎక్కడికైనా సరే!...

ఒకరోజున ఎవరో వింతవ్యక్తి పాముల్ని బయట్నుంచి లోపలికి తీసుకొచ్చి, 'బండికిందబడి నెత్తురైపోవలసింది బిడ్డ...బయటికి రానీకండి' అని నాగి కప్పజెప్పాడు.

జీబురుగెడ్డం... పెద్దబూచి లావున్నాడు...... ముఖం నిండా గాట్లు, ముక్కి మాలిన్యం ఒంటినిండా.... చూడ్డానికే వింత, రోత...కళ్లలో అసహ్యం...

నాగి ఏవగింపుగా చూసింది...అబూచి తాలూకు ఒంటిమీద మాలిన్యం బిడ్డకంటుకొంటదేమో అని తల్లి తల్లడిల్లిపోయింది.

'ఎవరు బాబూ నువ్వు?'

అలిసిన కళ్ళలో ప్రశ్న.

'నువ్వు నన్నెరుగుదువనుకొంటున్నావా?

అని తిరిగి ప్రశ్న.

'ఎక్కడో ఏదో అనుబంధం అనుకొంటూ'

విసిగిపోతోన్న ఆకళ్ళు.

'నీకు బాగా జ్ఞాపకమేనా? గుర్తించావా?'

విసిగిపోతోన్న ఆకళ్ళ రెపరెపలు భూతకాలాన్ని చప్పుడు చేస్తున్నట్టున్నయ్...

వింతవ్యక్తి బయటికొచ్చేశాడు.

నాగి గుమ్మంలోనించి తొంగి చూసింది.

పాడుగుడివైపు నడకసాగిస్తున్న వింతవ్యక్తి...

నాగికళ్ళు ఏదో పూర్వాన్ని దృశ్యీకరించుకొంటున్నయ్!

చిరుచీకటి పడుతోన్నప్పుడే నాగికాళ్ళక్కడికో ప్రయాణం తలపెట్టాయి. ముసలవ్వకి చెప్పకండా, పాముల్ని చంక వేసుకొని బయల్దేరింది.

ఏనాడో చూసినగుడి!...ఎవరో ఉన్న అలికిడి...అడుగుల సవ్వడికి, లోపల్నించి కేక.

'ఎవరూ వస్తే?'

నాగి చప్పుడు చెయ్యకండా లోపలికి తొంగి చూసింది. పాములు కళ్ళు మిటకరించుకొని, నాలిక వెళ్ళబెట్టి చూశాడు. పాముల్ని నేలమీద వదిలింది నాగి స్తంభం పక్కనుంచి దరదర పాకుతూ, బుస కొడుతూ వెళ్ళాడు.

వింతవ్యక్తి నిజంగా పామునే అనుకోవాలి! 'పాము...పాము...' అని కేక వేశాడు కళ్లు మూసుకొని కిటికీ ఎక్కి కూచున్నాడు.

నాగి కళ్ళముందు కనిపించింది!

'నువ్వా?' అన్నాడు అప్రయత్నంగా.

పాముల్ని చేతిలోకి తీసుకొంది. మెలికలు తిరిగిపోతున్నాడు. భయంతో వణికిపోతున్నాడు.

'పాము...పామనుకొన్నాను'

'పాపంటే అంత భయమేం?' అంది నాగి రెట్టించి.

'చిన్నప్పట్నుంచీ భయమే!' అన్నాడు తడబడుతూ.

'చిన్నప్పట్నుంచీనా? మద్దెనించా? నువ్వెవరివో? తెలిసిందా?

నేనెవరోన్న మాట తెలీకండా ఉంటుందా? నిన్ను మాత్రం పొద్దుట కుర్రాణ్ణప్పజెప్పేటప్పుడు చూశాను. నేను అడుక్కుని తిని బతికేవాణ్ణి! నాదగ్గరేవుంది? ఎందుకొచ్చావు ఇక్కడికి?'

'రెండేళ్ళ క్రితం ఇక్కడేం జరిగిందో జ్ఞాపకం లేదూ నీకు? నిన్ను పసిగట్టే వెంటబడ్డాను. వేషం మారినా గొంతుమారదండీ! వందమందిలో ఉన్నా నీ గొంతు పిటిక్కన పసిగడతా! ఈ పాముల్ని చూడు ...ఈడు తండ్రిలేని బిడ్డ...దిక్కులేని బిడ్డ...నా మానాన నన్నొదిలేసి, పారిపోయాడు తండ్రి. ఈబిడ్డ కోసం బతికాను...నాగరాజు వరాన పామైపుట్టింది బిడ్డ...ఈణ్ణి చూడ్డానికి పెపంచం ఇరగబడి వచ్చింది. అప్పుడేనా తండ్రినని చెప్పుకొంటూ వస్తాడేమో అని చూశాను. ఎవ్వరూ రాండే?...ఈపొద్దు చూశాను... నమ్మలేకపోయాను. మనిషి మారినా చూపు మారదు గందా! గొంతు మారదుగందా!...వెయ్యిమందిలో ఉన్నా ఇట్టే పసిగట్టాల్సిన చూపూ, గొంతూ' నాగి గొంతు పూడిపోయింది.

మొహంలో మాలిన్యం కరుగుతోన్నట్టుంది ఆ వ్యక్తికి. కళ్ళలో ఏదో మెరుపు మెరుస్తోన్నట్టుంది!

అతని మొద్దుబారిన జాలిలేని పెదవులు, పొగ

మూసిన గోడల్లాంటి చెవులు, గతాన్ని బలవంతంగా విప్పరిస్తున్నట్టున్నయ్!

'నాగీ' అన్న శబ్దం పాడుపడిన దేవాలయం గోడల్ని కూల్చి పారేసింది. రెండేళ్ల క్రితం వేసిన కేక ఇప్పుడు వినిపించినట్టుంది! ఈ రెండు సంవత్సరాల దీర్ఘకాలం గక్కదలిపోయినట్టయింది! నాటి నుంచి నేటివరకు, 'నాగీ' అన్న దీర్ఘాక్షరాల్ని సాగదీసి అరిచినట్టుంది!

'నాగి నా దేవత ఆ దేవతకి ద్రోహం చేశాను— పాముకాటుకి భయపడి'—అన్నాడు అచిత్రశక్తి.

నాగికళ్లలో నీరు గుక్కుకొంటూ నిలిచిపోయింది. నోట్లోంచి, ఆవేశం అంతరించింది. ఏనాటి నించీ కాపాడుకొస్తోందో జవసత్త్వం ఒక్క ఉదుటున కూలబడిపోయింది. పాములు వింతశక్తికేసి చూస్తూ, బుసకొడుతున్నాడు.

'ఈడే నీకొడుకు'

'నాకొడుకా' అన్నాడు. ఆశ్చర్యంతో పెనవేసుకొన్నాడు పాముల్ని.

'నిజంగా పామేనే నాగీ! పామంటే ఎంత భయపడేవాణ్ణో, ఆరోజున, పాములు నాకళ్లలో మెలికలు తిరిగిపోయాయంటే నమ్ము... శివకి నాభయం భయంనాగ నీకడుపున పడ్డది'

అలా ఎంతసేపు గడిచిపోయిందో, మౌనంగా భావగర్భితంగా, నాగికి అంతుపట్టలేదు!

నాగిలేచి, 'వెళ్తాను' అని సెలవు తీసుకొంది.

పాముల్ని ముద్దులాడి యిచ్చేశాడు.

'నేనొచ్చి దిగబెట్టనా?' అన్నాడు.

'వద్దులే! ఎవరేనే చూస్తే బాగోదు' అంటూ దారితీసింది.

ఏదారిన పోతోందో తనకే తెలియలేదు. చుట్టూ నల్లగా మాడిపోయి ప్రవహిస్తున్న చీకటి. భయం గుండెల్ని పిండిపారేస్తోంది. రోజూ నడిచేదారే! ఐతే నేం?...ఏదో అనూహ్యమైన భీతి...గజగజ వణికిపోయింది. పాములు బుసలు కొడుతున్నాడు. అల్లంత దూరంలో చిన్న కొండలాంటి పుట్ట... పుట్టలో ఏదో కదిలింది. కాంతివాకలా నెత్తురు జలజల కురుస్తోంది పుట్టమీద. నాగి చేతులెత్తి నమస్కరించింది. పాములు క్రిందికి జారిపోయాడు. భక్తిలో ఆవేశంలో తూగిపోయింది. పాములింకా చేతిలోనే ఉన్నాడనే భ్రమలో వుంది! పాములు మెల్లగా నల్లగా సాగిపోయాడు ఎక్కడికో అదిడాది పసిపాపకే అంతుపట్టదు! శైశవ్యంతో చేతుల్లో నమును దగ్గర చూసుకొంది. ఏంవుంది? శూన్యం...కెవ్వున కేక వేసింది ... ఎలుగెత్తి పిలిచింది. పుట్టలోంచి పాములు మిలమిలలాంగి చూశాయి. జలజల కదిలాయి. పాములా పుట్టలోకి సాగిపోతున్న పాప...ఏదో బారెడు పదార్థం కళ్లుబెళ్లు క్రమిస్తూ, నక్షత్రాల వెలుతురులో, 'పాములు' కాళ్లని చుట్టుపెట్టుకొని, పెదవుల్ని ముద్దుపెట్టుకొంది—

ఒక్క ఉదుటున నాగి పరిగెత్తుకెళ్లింది.

'పాములు' బుసకొడుతూ వున్నాడు. జోగుతూ వున్నాడు. నురగలు గక్కుతూ పొగలు లేపుతూ యమయాతన కళ్లలో ప్రతిఫలిస్తున్నాడు. ఆచీకటిలో, గుడ్డివెలుతురులో. 'ఎంతఅన్యాయం?...ఎంతఘోరం!...' ప్రకృతి ఘోషించింది నాగి గొంతులోంచి...

'పసిపాపే, నీ ఆకలికి దొరికిందా నాగరాజా! వయస్సులో పొంగులువారుతూ, జలజల రక్తంతో సంగీతంపాడే నరాల్ని విష కలుషితం చేసి. నావయస్సు మీద పడి నాట్యమాడలేక పోయావా? నాశరీరాన్ని పెనవేసుకొని, చిత్తమొచ్చిన చోట కాటువేసి ముద్దులాడలేకపోయావా?'...అని...

నాగి చింతచెట్టు కిందకి అప్రాణంలేని కట్టెలా చేరుకొంది. తెల్లవారులూ కన్నీళ్లు ప్రవహించింది. చివరికి స్పృహతప్పి పడిపోయింది.

గుడిగంటలు మోగుతున్నయ్!

సొమ్మసిలి పడిపోయిన నాగి గుండెలో ఘంటానినాదం విలోకించింతో మేల్కొల్పింది! పరుగు పరుగున ఆనల్లని విషవహ్నికీలాతప్తమైన పాముల్ని చేతిలో ఇరికించుకొని, దేవాలయం ముందు వాలిపోయింది!

పూజారి అడ్డగించాడు.

'ఈగుడి నేనే గట్టాను!... గుళ్లో దేవతని నేనే ముందు చూశాను. ఇందులో అడుగెట్టడానికి నాకర్హత లేదా? ఇదేం న్యాయం దేవుడా?.... నేను గడితే పనికొచ్చిన గుడిలో నన్ను దుగట్టనీరూ?' అని నాగి మెట్లమీద పడి ఆక్రోశించింది.

గుడిలోంచి దుర్గప్ప బయటి కొస్తున్నాడు. నాగిని చూసి గతుక్కుమని పోయాడు.

చేతిలో విషంతో మాడిపోయిన నల్లనిపాముల్ని చూసి చిత్తరపోయాడు. 'దురగయ్య రావా?' అంటూ నాగి అతని కాళ్లముందు పాముల్ని కన్నీటితో అభిషేకిస్తూ వాలిపోయింది.

గుడిగంటలు ఘణఘణ మోగాయి!

# సత్తి పెళ్లి

శ్రీ కంచి శేషగిరిరావు

## ఏకాంకిక

* * బీదవాని యిల్లు; విరిగిపోయిన కుర్చీలు; పాతబల్ల; మాసినబట్టలు వగైరా. సుబ్బయ్య, సత్యవతి; జిట్టబోచ్చు, నిక్కరు, చారల బనీనుతో సుబ్బయ్య మొరటుగా కనిపించుతూ వుంటాడు.

సత్య : ఎన్నిసార్లు చెప్పేదినాన్నా నీకు ! చెప్పి చెప్పి నోరు నొప్పిపుడుతోంది

సుబ్బ : (పరధ్యానంగా వున్నవాడల్లా కూతురుకేసి తిరిగి) ఏందది సతీ! మల్లా చెప్పు. నోట్లో గొణుక్కోకపోతే గట్టిగా ఏడవరాదూ ?

సత్య : ఏమిటి నాన్నా! ఎప్పుడూ కసురుకుంటావు- మంచి చెబుతున్నా అంతే.

సుబ్బ : కసురుకోకపోతే బతిమాలుకోమంటావా ఏంటి? నువ్వేమైనా కలకటేరువా?

సత్య : కలకటేరూ కాదు. ఉప్పుటేరూ కాదు.

సుబ్బ : మరి? —

సత్య : అదుగో! అట్లా గదమాయిస్తే నేను చెప్పేది లేదు బాబు. అమ్మ పోయినప్పటినుంచీ యిట్లాగే పీక్కుతింటున్నావు (కంట తడి పెట్టుకొనును )

సుబ్బ : ఈ ఆడంగులలో వచ్చిన పాపే యిది. గట్టిగా పలుకాడితే యిట్టే ఏడుస్తారు. (మెత్తబడి గొంతుక తగ్గించి) అయితే నువ్వు చెప్పేదేటో గబుక్కున చెప్పెయ్.

సత్య : రంగయ్యమావయ్య నీతో చెప్పమన్నాడు...

సుబ్బ : ఏమని ?......తనకివ్వాల్సిన ఏకైనా డేలు పంపించమనా?

సత్య : నాణేలుకాదు, నగలూ కాదు.

సుబ్బ : మరేటి ?

సత్య : ఇవాళ పెళ్ళికొడుకు చూసుకోడానికి వస్తాడుట. నిన్ను మంచిబట్టలు కట్టుకుని సిద్ధంగా వుండమన్నాడు.

సుబ్బ : ఎవడా పెళ్ళికొడుకూ, మనవుకొడుకూను! ఏడనుంచి వత్తున్నాడాడు?

సత్య : అదిగో! అట్లా బండమాటలు మాట్లాడొద్దని కూడా మావయ్య చెప్పమన్నాడు.

సుబ్బ : మరి మీ మావ గేదెమాటలు మాట్లాడతాడా యేం? "బాకీ తీర్చలేకేం యింకా" అని నిలేసి అగినప్పుడు సూడాలి అడి మాటవరస. మిరపకాయ నమిలినట్టుంటది లే !

సత్య : నామాట వినిపించుకో నాన్నా! మావయ్య చెప్పమన్నదంతా చెప్పనియ్యి.

సుబ్బ : చెప్పేదేటో గబుక్కున చెప్పెయ్. సెరి కోసిన మేకలా అరుత్తున్నావు.

సత్య : నీళ్లు పోసుకుని, మంచిబట్టలు కట్టుకుని నిన్ను సిద్ధంగా వుండమన్నాడు. కాఫీ, ఉప్మా తయారుచేసి నన్ను సిద్ధంగా వుండమన్నాడు. తను యిప్పుడే వస్తానన్నాడు.

సుబ్బ : పెళ్ళికొడుకు నా బట్టలు చూసి పెల్లిచేసుకుంటాడా ఏటి? అడికి కావల్సింది పిల్లేగా? నేనెట్టా వుంటే అడికేం?

సత్య : పెళ్ళికొడుకు నీ బట్టలు చూసి పెళ్ళి చేసుకోడులే. కాని నీ మాటలు వింటే వెనక్కి తిరిగి పారిపోతాడు

సుబ్బ : (కోపంగా లేచి) ఎవడా యెదవ నా కొంక పెట్టేది, అట్టాటి సమ్మంధం పోవాల్సిందే.

సత్య : నీకు శుభ్రం, అశుభ్రం, మంచిచెడ్డా తెలియవు నాన్నా. నోటికెంతొస్తే అంతవాగుతావు.

సుబ్బ : నాకు కిర్రెక్కలేదా, నేను మునిసిని కాను.

సత్య : మావయ్య వచ్చే వేళవుతోంది. చెప్పినట్టు చేస్తావా?

సుబ్బ : నీ మాట చెప్పినట్టు నేను చెయ్యడం ఎందుకు? అయినా మాట తెచ్చే సమ్బంధం నీ కెందుకే సత్తీ నీకు మా రాజులాంటి సమ్బంధం నేను తెస్తాలే.

సత్య : ఆ! తెచ్చావులే! "చెట్టులాగ ఎదిగిన కూతురుకు పెళ్ళి చెయ్యకుండా సుబ్బయ్య కులాసాగా కూర్చుంటున్నాడు" అంటూ మన వాడకట్టంతా నిన్నూ, నన్నూ నానా మాటలు అంటుంటే నీకు చీమ కుట్టినట్టయినా వుందీ? వాళ్ళ మాటలు విన లేక నా మన సెంత బాధపడుతోందో నువ్వెప్పుడయినా గ్రహించావూ? నీకొకటే నీది. ఇంటి సంగతి పట్టించుకుంటేనా? అమ్మ బతికి వుంటే ఇల్లా వూరుకోనిచ్చేదా? ఈపాటికి పెళ్ళిచేసి అత్తారింటికి పంపించి వుండేది.

సుబ్బ : నేను మటుకు వూరుకున్నా నేమిటి సత్తీ. మా పెద్దత్తి కొడుకును తెస్తే వద్దు పొమ్మన్నావు. నేనొప్పుకోను మొర్రో అన్నావు.

సత్య : మీ పెద్దత్తి కొడుకు నా కంటే 20 ఏళ్లు పెద్ద. పైగా రెండో పెళ్ళివాడు. పెళ్ళి అయి కాపురం చేస్తున్న నా అంత కూతురు. అతన్ని ఎల్లా చేసుకు నేది?

సుబ్బ : అయితే ఏం తక్కువా అంటా? నాల్గెకరాల మాగాణి వుంది. పైగా యిస్కూలు మాస్టరు పనిచేస్తున్నాడు. కట్నం కానీ కూడా అక్కర్లేదన్నాడు. మరీ యిన్నావూ?

సత్య : రెండో పెళ్ళి సంబంధం నాకొద్దు బాబు!

సుబ్బ : దాంతో వాడు రేచిక్కు విసుకొచ్చింది. తండ్రిమాట యినని కూతురు సంగతి నాకెందుకు. నాకేం పట్టింది. ఇక సమ్బంధాలు వెతకడం మా నేశా.

సత్య : అయిందేదో అయిపోయింది. ఇంక మావయ్య వూనుకున్నాడు...అదుగో మావయ్య వస్తున్నాడు. జాగ్రత్తగా మాట్లాడు మావయ్యతో. ...రా! మావయ్యా!

[ప్రవేశం రంగారావు. బుర్రమీసాలు, చెవికి దుద్దులూ వుంటాయి.]

సుబ్బ : రావయ్యా రావయ్యా రా! మా సత్తి నీమాటే చెబుతోంది యిందాకటి నుంచీ.

రంగ : ఏమే సత్యం! నేను చెప్పినమాటలు అన్నీ మీ అయ్యతో చెప్పేవా?

సత్య : ఇందాకటినుంచీ చెబుతుంటే. రాద్ధాంతం సిద్ధాంతం చేస్తున్నాడు.

రంగ : "అమ్మ పెట్టనూ పెట్టదు, అడుక్కుతిననివ్వదు" అట్లా వుంది మీ నాన్న సంగతి.

సుబ్బ : మహో తెచ్చావులేవోయ్ మనువులు. మద్దిన మేనమామకు కావలసివచ్చింది దానిసంగతి. ఇంత గొడవెందుకు, నువ్వే సేసుకోకపోయావ్?

రంగ : నేను వయసులో వుంటేనా, తప్పకుండా చేసుకు నేవాడినే ఈ రత్నాన్ని. ఏమంటావే సత్యం?

సత్య : అబ్బ వూరుకో మావయ్యా, వేళాకోళాలు.

సుబ్బ : కబుర్లకేంటిలే! కట్టంబెట్టంగా లాగకుండా సేసుకు నేవాడినా ఏంటి దాన్ని.

రంగ : కట్నం పుచ్చుకోని పెళ్ళికొడుకు నే సంపాదించాలే.

సుబ్బ : ఇంతకష్టమూ పూరికేపడతావా రంగయ్యా? ఏదో వుందిలే ఎవ్వారం.

సత్య : ఊరుకో నాన్నా! మామయ్య కేమొచ్చింది యిందులో డబ్బు ఖర్చు తప్ప.

రంగ : ప్రతిదానికీ నే నేదో స్వలాభం చూసుకొంటే ఏపనీ చేయననుకుంటావు నువ్వు, అంతేనా?

సత్య : ఊరుకో మావయ్యా, నాన్నమాటల కేమిటి. ఎప్పుడూ అట్లాగే అర్థం లేకుండా మాట్లాడుతూ వుంటాడు.

రంగ : లేకపోతే ఏమిటి? ఒక్కగా నొక్క పిల్ల, తల్లి లేనిబిడ్డ, ఈ షేరిన ఆడకూతురు. దానికి పెళ్లిచేసి ఒక యింటిదానిని చేయకుండా, డబ్బులేదని, కట్నం యిచ్చుకోలేనని నిన్ను మీ అయ్య రొష్టుపెడుతుంటే, చూస్తూ వూరు

కోలేక నేను నీ పెళ్లికి పూనుకుంటే, నా కొచ్చే పొద్దా యిది?

సత్య : ఊరుకో మావయ్యా! ఏమీ కష్టపెట్టుకోకు. నాన్న తీరు అందరికీ తెలిసిందేగా. అమ్మ పోయినప్పటినుంచీ అదేమిటో చిత్రంగా యిట్లా మారిపోయాడు.

సుబ్బ : నిన్నా నేనేమీ అనటం లేదులే రంగయ్య బావయ్యా. సమ్మందంసంగతి ఏమిటో చెప్పు.

రంగ : చక్కటి సంబంధం తెచ్చేగా. ఇప్పుడేవస్తున్నాడు ఆ పెళ్లికొడుకు పెళ్ళి మాపులకు.

సుబ్బ : పెళ్లికొడుకు ఎవరూ అంటా?

రంగ : వస్తున్నాడుగా, చూద్దువు గాని.

సుబ్బ : అదుగదుగో నీ దాపరికం మాటలు మానేవు కాదు. పెళ్లికొడుకు యివరాలు చెప్పమంటే నీలుగుతా వెందుకు.

రంగ : తొందరపడకు సుబ్బయ్యా, తొందరపడకు. మంచి బుద్ధిమంతుడిని, ఉద్యోగస్థుడిని గంగి గోవులాంటివాడిని వెదికి తెచ్చానుగా.

సుబ్బ : అరి భేష్! భలేవోడివే సంపాయించావన్న మాట. ఇంకేం! పాలు పితుక్కోవచ్చు.

సత్య : ఏమిటి నాన్నా; ఇదంతా నీకు వేళాకోళంగా వుంది. మావయ్య మనకోసం ఎంత కష్టపడు తున్నాడో నీకు తెలియటం లేదు.

రంగ : మీ నాన్న నాతో వెటకారంగా మాటాడ కుండా వున్నది ఎప్పుడు చెప్పవే సత్యం.

సుబ్బ : ఉండనివయ్యా బావయ్యా! అంత హైక్లాస్ సమ్మంధం తెచ్చేవంటే నాకుతే పోయింది. ఏదో అనేశా. ఊ! చెప్పు యింకా.

రంగ : సత్యం! నువ్వు లోపలికిపోయి కాఫీ ఫలహారల సంగతి చూసుకో. అతను వచ్చే వేళవుతోంది. అప్పుడు ఆలస్యం చేస్తే బాగుండదు.

[సత్యవతి లోపలికి వెళుతుంది]

సుబ్బ : వర్వాలేదులేవయ్యా ఆలస్యమయినా వచ్చి నోరు తీపికుండా ఎల్తాడేమిటి. సరేలే! పెళ్ళికొడుకు సంగతి చెప్పు. బుద్ధిమంతుడు గేదె, కాదు ఆవులాంటివోడు. ఊ! ఇంకా.

రంగ : బుద్ధిమంతుడు చదువుకున్నవాడు. స్కూలు ఫైనలు ప్యాసయినవాడు. యువకుడు.

సుబ్బ : బలే! బలే! కానాప్పుంటే కత.

రంగ : కవికూడాను.

సుబ్బ : కవేంటి?

రంగ : మాట అర్థం కాకపోతే వూరుకో. కవంటే, కథలు పాటలు పద్యాలు రాసేవాడు.

సుబ్బ : మరిగయితే, కామమ్మకత రాసింది యీడేనా?

రంగ : చవ్! బుద్ధితక్కువగా మాట్లాడకు. అతను చాల చక్కగా పాటలు పాడుతాడు. మొన్న మనవూరి స్కూలు వార్షికోత్సవంలో ఎంత చక్కగా పాడేడనుకున్నావు పాటలు.

సుబ్బ : నన్ను కూడా పిలవకపోయావ్ ? వచ్చి వినే వోడిని.

రంగ : ఆపాటలు అర్థంకావులే నీకు. పారాసీసా పాట, పచ్చబొట్టుపాట అనుకున్నావా ఏమిటి పాడింది.

సుబ్బ : అయితే ఘుమ్ ఘుమాఘుమ్ పాటలు యీడు పాడలేడూ? ఓస్ యింతేనా.

రంగ : నీఅల్లుడయ్యాక నేర్పుదువుగానిలే.

సుబ్బ : సరేలే! ఆడు చేసే ఉద్యోగం ఏమిటి?

రంగ : రాజాలాంటి ఉద్యోగం చేస్తున్నాడు. నెలకు 60 రూపాయలు సంపాదించు కొంటున్నాడు.

సుబ్బ : ఎక్కడ?

రంగ : ఇక్కడే మనవూళ్ళోనే మందులషాపులో.

సుబ్బ : చెప్పేవుకాదు! అందుకనే నేంటే, వారం రోజులనుంచీ ఆమందులబజారులో కాలు కాలినపిల్లిలాగ తిరుగుతున్నావు మీయింట్లో ఎవరికో రోగమొచ్చిందనుకున్నా.

రంగ : ఛీ! నోరు మూసుకో. అపద్ధం మాటలూ నువ్వూను.

సుబ్బ : మందులషాపులో నాకు తెలియని మనిషి ఎవడంటా?

రంగ : కొత్తగా రాలా ? కాంపౌండరు. వెనక గదిలోవుండి మందులు కలిపి యిస్తుంటాడు.

సుబ్బ : అరకులు కలిపిస్తే ఆడా? ఛు! ఆడంగి వెంగం ఆడూనూ. గిరజాలూ పేడిమాటి, కళ్ళజోడు. ఆడంగిమాటలూ ఆడూను.

రంగ : నోటికి వచ్చినట్లుగా పిచ్చివాగుడు వాగకు. ఇంతనుంచి సంబంధం వద్దన్నావంటే ఇంక జన్మజన్మాలకు యిటువంటిది దొరకదు.

సుబ్బ : నాకెందుకులే! పీటలమీద ఆడిప్రక్కన నేను కూకుంటేగా. అయితే యీ అరకులు కలిపేవాడి పేరేంటి?

రంగ : రజనీకాంతకుమార్.

సుబ్బ : ఓరయ్యో! పేరు కూడా మాపాసుగ్గా వుంది.

రంగ : కవుల పేర్లు అట్లాగే వుంటాయిలే.

సుబ్బ : అదిగదీ! (వేళ్లు లెక్కపెడుతూ) బుద్ధిమంతుడు. గేద...కాదు! కాదు! ఆవులాంటి వోడు. చదువుకున్నవోడు. పాటలు పాడే వోడు. బారెడు పేరు గలవోడు...మరి కట్నం లేకుండా మా సత్తిని పెళ్లి చేసుకోడానికి ఎట్టా తయారయాడంటా? భలే సిత్రంగా వుందేయిది. మా సత్తి అడికళ్లకు రంభలాగ కనబడ్డదాయేంటి? లేకపోతే...లేకపోతే... ఏమైనా...వంకలు...

రంగ : ఛీ! వూరుకో! లక్షణమైన సంబంధం కాకపోతే నేను తెస్తానా ఏమిటి?

సుబ్బ : అయితే మరి ఎందుకు సిద్ధమయాడంట? అదే నాకు పట్టుకుంది.

రంగ : కవుల సంగతి నీకు తెలీయదులే! వాళ్లకు కావలసింది కట్నాలు కాదు, కాంతిలు. వాళ్లయూహలకు నచ్చినపిల్ల దొరికిందంటే ఇకమని పెళ్ళికి తయారవుతారు. తెలిసిందా?

సుబ్బ : మరి యీ రజనీకుమారుడుగారు మా సత్తిని సూసుకోకుండా పెళ్ళికి ఎట్టా తయారయాడు?

రంగ : మందులు కొనడానికి షాపుకు వెడితే ఒకటి రెండుసార్లు చూశాడుట.

సుబ్బ : సరే! అప్పుడు చూశాడుగదా, మల్లీ ఇప్పుడు సూపులెందుకు, దగాటికి పెళ్లి సేసుకోక.

రంగ : అప్పుడు సరిగా చూడలేదుట. అయినా పెళ్లికొడుకు చూపులకు రావటం, పిల్లచేత పాటలు పాడించటం ఇవన్నీ లాంఛనమని తెలీదూ నీకు.

సుబ్బ : అయితే రజనీఅయ్య కేంపని?

రంగ : అయ్య లేడు. అమ్మ లేదు. మేనమామ వున్నాడు. మున్సబుపని చేస్తున్నాడు. కారు, నౌకర్లు, ఓ! బలేహోదాగా వుందిలే ఆయన ఉద్యోగం.

సుబ్బ : మునసబుకు వెట్టివోడు, పాలేళ్లు వుంటారు కాని, నౌకర్లు, కార్లు ఎందుకుంటాయయ్యా బావా?

రంగ : అబ్బ! పల్లెటూరిమున్సబు కాదయ్యా బాబూ! నీకింతా అపనిచేశం; కోర్టు మునసబు అంటే జడ్జీ అన్నమాట.

సుబ్బ : అదిగదీ! అట్టా సెప్పు. మామ మునసబీ అయితే, అల్లుడు అరకులు కలిపిస్తుంటాడా! శ్రేష్! మరి అల్లుడికి పొలం పుట్రా ఏమైనా వున్నాయా?

రంగ : పొలం, స్థలం, యిల్లు, రొక్కం యివేమీ లేవు. మంచి ఉద్యోగం. మంచి గుణాలు వున్నాయి. ఇంకేం కావాలి?

సుబ్బ : అయితే మామకు తగ్గ అల్లుడొస్తున్నాడన్న మాట. (నవ్వుతాడు)

రంగ : నవ్వు ఆపేసి, స్నానం చేసి పంచె చొక్కా కట్టుకుని రా. (వాచి చూసుకుని) అప్పుడే తొమ్మిదవుతోంది. ఈపాటికి అతను బయలుదేరి ఉంటాడు.

సుబ్బ : రానియ్యి.

రంగ : నువ్వు సిద్ధం కావయ్యా.

సుబ్బ : సిద్ధంగానే ఉన్నానుగా.

రంగ : ఆ వికారూ, ఆటనీమా, ఆదుబ్బ జుట్టూ చూశాడంటే ఎవరో నౌకరనుకుంటాడు చిన్నా.

సుబ్బ : (కోపంగా లేచి) నౌకరనుకుంటాడూ! అనుకోటానికి ఎన్నిగుండెలాడికి. అనుకోమను. అప్పుడు చూపుతా వాడిడాఖా. సుబ్బయ్య అంటే ఎవరో తెలుస్తది. పాటలూ గీటలూ పరుగెత్తాల.

రంగ : ఇవ్! ఏమాయిందయ్యా బాబూ! నీకు మర్యాదా తెలియదు, మంచీ తెలియదు. నువ్వు ముందు ఇక్కడినుంచి లేచి స్నానం చేసి బట్టలుమార్చుకుని రా...ఊ! లే!

[ప్రవేశం సత్యవతి]

సత్య : ఇదిగో నాన్నా! నీ పంచె, చొక్కా; రెండూ ఇస్త్రీ చేయించాను. చొక్కాకు గుండీలుకూడా పెట్టేను! అద్దం దువ్వెన్నా యిదిగో (అన్నీ బల్లమీద పెడుతుంది)

సుబ్బ : నా పంచె, చొక్కా చూసి ఆడు నిన్ను పెళ్లిసేసుకుంటాడా? సేసుకునేది నిన్ను, నన్నా? నేనెట్లా వుంటే ఆడికెందుకు.

రంగ : అబ్బబ్బ! మొదలెట్టావయ్యా మళ్ళీ సతాయింపు. నీకు కావలసినవన్నీ అది యింకె న్నాళ్లు అమర్చిపెడుతుందిలే? పాపం! మా చిట్టితల్లికి మూడుముళ్ళూ పడేంత వరకే. అత్తార్వారి దానికోసం అది పోతుంది. అప్పటినుంచీ అన్ని పనులూ నువ్వే చేసు కోవాలి.

సుబ్బ : ఆఁ! (కూలబడి) అప్పుడే అత్తారింటికి మా సత్తి నన్నొదిలిపెట్టి ఎల్లిపోతుందా?

రంగ : వెళ్ళిపోక ఎన్నాళ్లు కూర్చుంటుంది పెళ్లి అయిన పిల్ల నీ యింట్లో. వస్తే నే నుంచిదిలే. నీ తిట్టూ పాదింపులూ తప్పుతాయి. అసలీపాటికే నువ్వు దానిపెళ్లి చేసివుండాల్సింది. ఎందరు చెప్పినా వింటేనా? డబ్బులేదని ఒకటే గోల.

సుబ్బ : నన్నడిగితే డబ్బులేనోడికి ఆడకూతురు పుట్ట కూడదంటా. సత్తిమీద వాలుగంటికలున్న ప్రతి నాయలూ, వెయ్యిత్తావా, రెండువేలి త్తావా అని అడుగుతుంటే నేనెక్కడినుంచి తెచ్చి గుమ్మరిత్తా అంతడబ్బు.

రంగ : ఫాక్టరీలో మేస్త్రీ పని, 60 రూపాయలు జీతంకదా నీకు. ఈ ఇంటికి మీరిద్దరేకదా. జీతంలో కొద్దిగా వెనక వేస్తూ కొంత అప్పు చేసి పెళ్లి చేయడానికి ప్రయత్నం చేశావ్?

సుబ్బ : డబ్బు మిగిలినచ్చిందేమిటి సెయ్యడానికి.

రంగ : ఎట్లా మిగులుతుంది? సారా దుకాణం జువ్వాట మానితేగా!

సుబ్బ : కాకినాడలో పనిచేసేటప్పుడే రంగ వెళ్లి పోతే బాగుండేది. ఈ పాటికి యేలు సంపా యించి మా సత్తికి యిందరావైభోగంగా పెళ్లి సేసేవోడిని.

రంగ : అతని దానికి అనుకోవడం ఎందుకులే. ఇన్నాళ్లు కష్టపెట్టేవు ఒక్కగానొక్క సంతానాన్ని. పాపం! మా సత్యం ముత్యంలాంటిపిల్ల. ఎప్పుడూ కసురుకోడం, కర్రుమనడం, అది లేదని యిది లేదని అలరిచేయడం, నిషాలో వుండి రెండు మూడు సార్లు కొట్టేవుట కూడాను. ఇన్నాళ్లకు కష్టాలు గట్టెక్క డానికోసం అది పోతోందంటే యింకా అడ్డొస్తావెందుకు?

సుబ్బ : (కళ్ళనీళ్లు పెట్టుకుంటూ దీనంగా) నిజమే బావయ్యా, నువ్వు చెప్పిందంతా నిజమే. ఎందుకూ పనికిరాని రోమనను నేను. సత్తె కాలపుపిల్ల మా సత్తి దాన్ని బాధపెట్టేను. పాపాత్ముణ్ణి ఇప్పుడేం చెయ్యమంటావు.

రంగ : నేను చెప్పినట్టువిను. లే! నీళ్లు పోసుకుని యీ బట్టలు కట్టుకో. అతడొచ్చాక మర్యాదగా మాట్లాడు. తక్కిన సంగతంతా నేను చూసుకుంటా.

సుబ్బ : (మౌనం)

రంగ : నీ అల్లరితో యీ సంబంధం చెడగొట్టేవంటే, వెయ్యేళ్ళు తపస్సుచేసినా మళ్ళా యిల్లాంటి సంబంధం దొరకదు. ఇంక నేను కలుగజేసుకోను. నీ మూలాన నీ కూతురు జీవితమంతా పెళ్ళిగాకుండా వుండవలసి వస్తుంది. ఆలోచించుకో.

సుబ్బ : సరేలే. నాకు తెలిసొచ్చింది. నువ్వు చెప్పి నట్టే సేత్తా.

రంగ : ఇక పద. లోపలకు వెళ్లు. (చొక్కా, పంచె భుజంమీద వేసి సుబ్బయ్యను లోపలకు తోస్తాడు) ఇదుగో అమ్మాయి సత్యం! కాఫీ ఫలహారాల సంగతి చూసుకుంటు న్నావా?

సత్య : మొదలు పెట్టేను మావయ్యా.

రంగ : కదళీఫలాలు తెప్పించావా?

సత్య : ఆ.

రంగ : మా యింటినుంచి గాజుగ్లాసులూ, కప్పులు సాసర్లు పంపించాను అందేయా?

సత్య : అందాయి. ఇప్పుడే రాము తెచ్చియిచ్చింది.

రంగ : అయితే నీ పని నువ్వు చూసుకో.

[సత్యవతి లోపలికి వెడుతుంది.]

[ప్రవేశం సుబ్బయ్య. భుజంమీద పంచె, చొక్కా, తువ్వాలూ, చేతిలో సబ్బుతో.]

సుబ్బ : అయితే రంగయ్యబావా! సత్తి కాపురాని కెళితే, నాగతేంకావాలి?

రంగ : నీకేం తక్కువ పాడుకోనం, పేకాట, రాడీస్నేహితులు వున్నారుగా.

సుబ్బ : అబ్బ ఉండవయ్యా! నా బాధ నేను పడుతుంటే కాకిని పొడిచినట్టు పొడుస్తావు

రంగ : అవునులే. ఎంతచెడ్డా తండ్రివిగా. నీకు మటుకు బాధవుండదా ఏం?

సుబ్బ : నేనుకూడ మా సతితో అల్లుడింటికి ఎళ్ళొచ్చా?

రంగ : బాగుంది నువ్వెందుకు అక్కడికి? వాళ్ళిద్దరిని రోజా సతాయించడానికా?

సుబ్బ : మరి అంతేనంటావు.

రంగ : లేకపోతే. మూట సంపాదించు, మూట మూటకోసం రమ్మంటాడు అల్లుడు.

సుబ్బ : దీని దుంపతెగ! అన్నిటికీ యీ డబ్బే! అంత డబ్బు నేనెట్టా పోగుచేస్తా?

రంగ : డబ్బులేకపోతే అంతే.

సుబ్బ : మరి నేనొక్కడిని యీ యింట్లో లింగు లింగుమంటూ కూకోవాలా? వంటా గింటా నేనె చేసుకోవాలా?

రంగ : అంతే మరి; కాని సుబ్బయ్యా! నేను నీకొక సహాయం చేస్తా, కావాలంటే. నీ జీతం డబ్బులలో యిరవయ్యో, పాతికో నాకియ్యి. ముప్పొద్దులావచ్చి మా యింటికి మాతో బాటు భోజనం చెయ్యి. మిగతా డబ్బు నీ ఖర్చుకు జాగ్రత్తగా వాడుకో. (తలుపువేపు చూచి) అడుగో! పెళ్లికొడుకు వస్తున్నాడు! ఇంకా నువ్వు ఇట్లాగే వున్నావు. నీళ్లు పోసుకోవద్దులే సబ్బుతో కాళ్లు చేతులు మొగం కడుక్కొని బట్టలు మార్చుకుని త్వరగారా. పద లోపలికి (వీపు పట్టుకుని లోపలికి సుబ్బయ్యను నెట్టుతాడు)

[సుబ్బయ్య నిష్క్రమణ]

రంగ : (తలుపుకు ఎదురుగా నడుస్తూ) రండి కాంపౌండరుగారూ! రండి మీకోసమే ఎదురుచూస్తున్నాం.

[ప్రవేశం రజనీకాంతకుమార్. వయస్సు. 25 సం॥ లాల్చి, పైజమా, పైన వల్లెవాటుగా ఉత్తరీయం, కళ్ళజోడు. ఒక చేతిలో చేతిరుమాలు, మరొక చేతిలో పుస్తకం]

రంగ : (కుర్చీ చూపిస్తూ) రజనీకాంత్ గారూ! ఈ కుర్చీలో కూర్చోండి.

రజ : (కుర్చీ రుమాలుతో చాలాసేపు తుడిచి కూర్చుంటాడు)

రంగ : సరిగ్గా టయిముకు వచ్చారండి మీరు.

రజ : (వాచి చూసుకుంటూ) "పంక్చుయాలటీ" అంటే నాకు అతి పట్టుదలండీ రంగయ్య గారూ! అరు మూరయినా సరే టంచన్‌గా టైముకు రావాల్సిందే. నాకు అలవడిన యింగ్లీషువారి అలవాట్లలో యిది ఒకటి (కళ్లజోడు సరిచేసుకుంటూ పోజు పెడ్తాడు.)

రంగ : అది చాల మంచి అలవాటండీ.

[ప్రవేశం సుబ్బయ్య సైడ్‌వింగుదగ్గరనుంచి మెల్లగా అడ్డదిడ్డంగా పంచె కట్టుకుని, చొక్కా కాలరు లోపలికి వేసుకుని, గుండీలు పెట్టుకోకుండా, తడిమొగంతో—జుట్టుమీదనుంచి నీళ్లు కారుతూ వుంటాయి ]

సుబ్బ : ఏయ్‌సత్తీ! తువ్వాలు ఎక్కడ తగలేశావ్? నిన్నే, యినపట్టంలా? (పెళ్లికొడుకుని చూసి, కంగారుపడి, ఒకటి రెండడుగులు వెనుకకు వేసి గొంతుక తగ్గించి) పోనీలే. ఫర్వాలేదులే పంచెతో తుడుచుకుంటాలే! [సైడ్‌వింగ్‌లో నుంచి సత్యవతి తువ్వాలు సుబ్బయ్యమీదకు విసరివేస్తుంది. అతను

తువ్వాలుతో మొగం తుడుచుకుంటూ బల్ల దగ్గరకువచ్చి తువ్వాలు రజనీ కూర్చున్న కుర్చీమీద పడవేసి, బల్లమీద నున్న అద్దం దువ్వెన తీసుకుని తల దువ్వడం మొదలు పెట్టి నీళ్లు తక్కినవాళ్ళ మీదకు చిదల్చుతూ వుంటాడు ]

రంగ : ఏమిటీ అఘాయిత్యం సుబ్బయ్యా? తల జాగ్రత్తగా దువ్వుకో ప్రక్కన పెద్ద మనుష్యులు కూర్చుంటే కనపడటంలా?

రజ : ఈయన ఎవరండీ?

రంగ : ఈయన నేనండీ మీకు కాబోయే మామగారు మా బావమరదే లెండి. పేరు సుబ్బయ్య

సుబ్బ : దీని సిగ తరగా! జుట్టు బలేగా చిక్కు పడింది! (జుట్టుతో కుస్తీ పట్టుంటాడు).

రంగ : మా సుబ్బయ్యది కొంచెం పల్లెటూరు వాలక లెండి. పట్నం మర్యాదలు మాటలు తెలియవు. అతని స్వభావమే అంత. ఏమీ అనుకోకండి.

రజ : "నో మేటర్" మరేం ఫర్వాలేదులెండి. స్వభావసిద్ధంగా వుండే వాళ్లు అంటే నాకు యిష్టం. అచ్చే! అరువుమాటలు ఎరువు పలుకులు అంటే నాకు తలనొప్పండీ!

రంగ : చిత్రం! తమరు మానవ స్వభావాన్ని బాగా అర్థం చేసుకుంటారండి.

రజ : కవులకు వుండవలసిన మొదటి లక్షణం అదే అనుకోండి నిజంగా మీ బావగారు సాన బట్టని వజ్రం అనుకోండి.

సుబ్బ : (కోపంగా రంగయ్యవేపుతిరిగి) నా గురించి ఏమిటే అనుకుంటున్నారు.

రజ : ఏమీ లేదు సుబ్బయ్యా! నువ్వు రత్నాలాంటి వాడివని రజనీకాంత్ కుమారుగారు చెబుతున్నారు.

సుబ్బ : ఓస్! అంతేనా ఇంకేమిటో, అనుకున్నా.

రజ : చూశారా రంగయ్య గారూ! మా మున్సబు మామకూడా యింతేనండి. ఇల్లు కూడ కోర్టే అనుకుంటాడు. జడ్జిమెంటు యిచ్చినట్లు మాట్లాడుతాడు.

సుబ్బ : (తల అష్టదిష్టంగా దువ్వుకుని పంచె సరిచేసుకుంటూ) అబ్బ! దీని సిగ తరగ. ఈ పాడు పంచె ఎగదోస్తే దిగజారుతుంది. ఎట్లా ఏడిసేదంట. నాకు అలవాటు లేదు మొర్రో అంటే. కట్టుకో, కట్టుకో అని సంపుతారు. కట్టుకుంటేనేగాని మర్యాద కాదట?

రంగ : (సుబ్బయ్యవేపు కళ్లురిమి చూస్తాడు)

సుబ్బ : (గొంతుక తగ్గించి వినయంగా రజనీవేపు తిరిగి) పంచె అలవాటు లేదండి రజనీగారూ అందుకనే యీ తిప్పలు.

రంగ : (లోపలకు నిష్క్రమించుతాడు)

రజ : దానికేమిటండీ! మరేం ఫర్వాలేదు. మీరు యింకా అంతవరకైనా కట్టుకున్నారు నాకు అదీ చేతకాదు. రాత్రింబగళ్లు పైజమామీదే వుంటా; మా మున్సబు మామా అంతే.

రంగ : (లోపలినుండి స్టేజిమీదకు వచ్చి, చేతులో నున్న కమలాఫలాలు వలుస్తుంటాడు) రజనీకాంత్ గారూ యీ కమలాఫలం తొనలు కొంచెం రుచిచూడండి.

రజ : ప్రొద్దున్నే కమలాఫలం తొనలేమిటండీ? పయిందవు.

రంగ : మంచి నాగపూర్ కమలాలండీ రెండు తొనలు సేవించండి.

సుబ్బ : (చొక్కా కఫ్సుతో తికమకలు పడుతున్న వాడల్లా కోపంతో) కమలాఫలాలా? ఏమే సత్తీ! పావలా డబ్బులు పెట్టి కమలాఫలం ఎవరు తెప్పించమన్నారే (రంగయ్యవేపు చూసి సంభాషణ మార్చుతూ రజనితో) పావులా పెట్టి కమలా తెప్పించే బదులు అర్థ రూపాయి పెట్టి ఆపుల్ పండు తెప్పించ మన్నానండి.

రజ : (తొనలు కొరుకుతూ) మా మామ యింట్లో ప్లేట్లనిండా కమలాలు ద్రాక్షలు, ఏపుల్సు ...ఓ ఎక్కడికక్కడగా వుంటాయండి.

సుబ్బ : (రజనితో) కాంపౌండరుగారూ! చదువుకున్నోరుగందా! ఈ తొనలలో గింజలు దేముడు ఎందుకు పెట్టేడో చెప్పండి.

రంగ : అబ్బ వుండవయ్యా! అర్థం లేని ప్రశ్నలూ నువ్వూను.

రజ : (సుబ్బయ్యతో) రైట్! మంచి ప్రశ్న వేశారు. దానిని కవిత్వంలో చెప్పాలంటే పెద్ద గ్రంథం అవుతుంది. మూడు ముక్కల్లో చెబితే తొనకు గింజ ఆధారం—అంతే.

సుబ్బ : అదిగదీ! మా బాగా సెలవిచ్చేరు. మరిగయితే ఒంటికి కమలాలు మంచివా, బత్తాయిలు మంచివా సెప్పండి.

రజ : రెండూను.

సుబ్బ : మరేమో మా ఫాక్టరీ డాక్టరుగోరు బత్తాయే ఒంటికి మంచిదంటూ రేమండి.

రజ : ఆరోగ్యవిషయం కాదు నేను చెప్పింది; తినే విషయం. తినడానికి రెండూ మంచివే.

[తొనలన్నీ తినేస్తాడు.]

రంగ : రజనీకాంత్ గారూ! ఇక మనము వ్యవహారానికి వద్దాం.

రజ : ఓ! వద్దాం! దానికేముంది. అయినా సబబైన ప్రశ్నలు వేసినప్పుడు వాటికి జవాబు చెప్ప వలసిన బాధ్యత మా కాంపౌండరుల మీద, కవికుమారులమీద ఉంది. మాట్లాడ్డం నేర్చి నప్పటినుంచి నేను మా మామను ప్రశ్నలు తెగవేసేవాడిని. ఆయన వాటి కన్నిటికి చక్కగా జవాబిచ్చేవాడు

రంగ : నిజమేనండి. అందుకనే మీరు అన్ని కథలు, పాటలు, పుస్తకాలు రాశారు. మొన్న మూక్కలలో మీ పాట విని చాలా ఆనందించావండి.

రజ : పాటలు పద్యాలు రాయడం, వాటిని కోకిల స్వరంతో గానం చేయడం చేతగాకపోతే వాడు కవే కాడనుకోండి. పువ్వు పుట్టగానే పరిమళించునట్లుగా, నేను పుట్టగానే నా ఏడుపు తన చెవులకు వీణావాదంలాగా వినిపించిందని మా మునసబు మామ ఇప్పటికీ చెబ్తూంటాడు.

రంగ : మాబాగా సెలవిచ్చారు.

సుబ్బ : ఏదీ ఒక పాటపాడండి. వింటాను.

రంగ : పాటకు తొందరేమొచ్చింది సుబ్బయ్యా! లోపలకువెళ్ళి అమ్మాయిని తీసుకువచ్చి చూపించు. ఆలస్యం ఎందుకు పద.
(సుబ్బయ్య నిష్క్రమణ)

రజ : తొందరేమొచ్చిందండి. ఇవాళ ఆదివారం కూడాను ఇక్కడుంటే నిజంగా స్వగృహం లాగా వుందనుకోండి

రంగ : అంత మీదయ స్వగృహమే చేసుకోండి.

రజ : రంగయ్యగారూ! మీ బావగారికి ఆస్తి పాస్తులు ఏమున్నాయండి?

రంగ : రజనీకాంత్ గారూ! మీకావిషయం ఇది వరకే చెప్పేనుగదండీ నాదగ్గర దాపరి కాలు లేవు. సుబ్బయ్యకు ఫ్యాక్టరీలో మేస్త్రీగా పనిచేస్తే వచ్చే 60 రూపాయిల జీతంతప్ప యింకే చరస్థిరాస్తులు లేవు

రజ : బ్యాంకులో నిల్వ ఏమైనా......

రంగ : అరవై రూపాయిల జీతంలో యీరోజుల్లో అప్పుచేయకుండా జీవిస్తే అదే పదివేలు. మా మేనకోడలు తెలివైనపిల్ల గాబట్టి, సంసార పక్షమైనది గాబట్టి ఆ అరవై రాళ్ళతో పొదుపుగా సంసారం నిర్వహించుకువస్తోంది.

రజ : అంతేనంటారా! మరి మీ సంగతి?

రంగ : ఏదో కొద్దిగా వ్యవసాయం చిన్నయిల్లు, వున్నాయి కాస్తో, కూస్తో రొఖ్ఖం వడ్డీకి తిరుగుతోందనుకోండి. అయినా మిగిలి వస్తుందీ. గంపెడు సంతానం మరి మీ సంగతి?

రజ : నేనుకూడా మీకిదివరకే చెప్పేనుకదండీ. విద్యాభూషణంతప్ప వేరే భూషలు లేవని. మగవాడి కింతకంటే ఏంకావాలండీ. సుబ్బయ్యగారూ, నేనూ ఒకేరీతిగా వున్నాం.

రంగ : మరి మా అమ్మాయికి నగలు?

రజ : కట్నం నేను పుచ్చుకోను. నగలు పెట్టేది లేదు.

రంగ : బాగా సెలవిచ్చారు.

రజ : కవనంతో, గానంతో ఆంధ్రావనిని రసవంతం చేస్తున్న నా ప్రతిభ విని పరమేశ్వరీ

